# ఆర్యవైశ్యమహాసభ,

## ఉత్తరఖండము కమిటీ.

### పీఠిక.

సంఘముయొక్క 1913-1914 సం॥ తాలూకు కార్యాధికమునివేదించుటకు పూర్వము ఈసంఘోత్పత్తికి మూలకారణంబైన "ఆర్యవైశ్యకాన్ఫరెన్సును" గురించి కొంత విశదీకరించవలసియున్నది.

### కాన్ఫరెన్సులు.

నెల్లూరువాస్తవ్యులును, వేంకటగిరి సంస్థానాధీశులయొద్ద చిరకాలము దివాన్ పదవినలంకరించిన శ్రీసుంకు నారాయణస్వామి శ్రేష్ఠి బి. యే. గారు నెల్లూరునందు "వైశ్య" యను పత్రికను ప్రకటించుచు స్వకులాభివృద్ధి కనుకూలమైన విషయములుచర్చించుచు మహోపకారముగావించుచుండిరి. వైశ్యకులాభివృద్ధికి పలువురు పెద్దలొకచోట సభారూపమునగూడి సాంఘిక, నీతి, మతవిషయములనుచర్చించి పురోవృద్ధికి మార్గములు యోచించి యెడల కామితఫలంబులు త్వరలో సమకూరగలవని తలంచి "ఆర్యవైశ్యకాన్ఫరెన్సు" జరుపవలెనంబున సంకల్పించిరి. ఇట్టికోరిక శ్రీఅత్మూరి లక్ష్మీనరసింహ

సోమయాజిగారి మనంబునుంగూడ కుతూహలపరచెనని తెలియ
వచ్చెడిని. శ్రీనారాయణస్వామిశ్రేష్ఠిగారు తమ మనోభీష్టమును
గుంటూరుపురవాస్తవ్యులగు కొందరు వైశ్యప్రముఖులకు తె
లియఁజేయ వారప్పరంబున నొకవైశ్యసంఘముస్థాపించిరి. ఆసం
ఘమువారు శ్రీసుంకు నారాయణస్వామిశ్రేష్ఠిగారి యాధిపత్య
మున 1907 సం॥ వేసవికాలమున "ప్రథమఆర్యవైశ్యమహా
సభ" గుంటూరులో జయప్రదముగజరపిరి.

అప్పటినుండియు నీయుద్యమము పరంపరాభివృద్ధిగాం
చుచున్నది. ద్వితీయకాన్ఫరెన్సు 1908 సం॥ న మచిలీపట్టణ
మున మ॥ రా॥ పి. యం. చక్రపాణిశ్రేష్ఠి బి. యే. గారి యా
ధిపత్యమునను, తృతీయకాన్ఫరెన్సు 1909 సం॥ న కాకినాడలో
మ॥ రా॥ పరచూరు కృష్ణస్వామిశ్రేష్ఠి బి. యే. గారి యాధి
పత్యమునను, చతుర్థకాన్ఫరెన్సు 1910 సం॥ జూనుమాసమున
విజయనగరంబున మ॥ రా॥ వేమూరి తిరువేంగడత్తానుశ్రేష్ఠి
గారి యాధిపత్యమునను, అయిదవకాన్ఫరెన్సు 1911 సం॥ జూను
నెల 18, 19, 20 తేదీలను చెన్నపురియందు మ॥ మార్గాపుర
ము చంగయ్యశ్రేష్ఠి బి. యే. గారి యాధిపత్యమునను, ఆరవ
కాన్ఫరెన్సు 1912 సం॥ న కుంభకోణమున సంఘాధ్యక్షులగు
మ॥ రా॥ నాళం పద్మనాభం బి. యే. గారి యాధిపత్యమునను
అధిక యుత్సాహముతో జయప్రదముగ జరుపఁబడినవి. 1913
సం॥ న జరుగవలసిన కాన్ఫరెన్సు బళ్ళారిపురమున జరుగవల
సియుండెను. కాని బళ్ళారిపురవాస్తవ్యులకు కొన్ని స్థానికవివాద
కారణములచే నైకమత్యము కుదరనందున, నాసంవత్సరము

కాన్ఫరెన్సుజరుగదయ్యె. సప్తమకాన్ఫరెన్సు 1914 సం॥ మేయి 20, 21, 22 తేదీలను యేలూరులో మ॥రా॥సల్లా గురుస్వామి శ్రేష్ఠి బి. యే. బి. యల్. గారి యాధిపత్యమున జరుగబోవు చున్నది.

కాన్ఫరెన్సులు ప్రారంభించిన దాదిగ, వీనియందు వైశ్యులకెల్లరకు నాదరము మెండగుచున్నది. విజయనగరమున "చతుర్థకాన్ఫరెన్సు" లోనీసభకు చక్కని నిర్మాణమేర్పరుప బడినది. ఈనిర్మాణమువలన కాన్ఫరెన్సులు ఆర్యవైశ్యమహా సభపక్షమున జరుగునటులయును, యీసభవలనగలుగు ప్రయోజనములందరికి సమానముగ లభించుటకుగాను ప్రదేశమంతయు, ఉత్తరఖండము, రాజధానిఖండము, వాయవ్యఖండము, దక్షిణఖండము, అనినాలుగుఖండములుగ భాగింపబడి ప్రతి ఖండము ముఖ్యపట్టణమునందును (అనగా కాకినాడ, మద్రాసు బళ్ళారి, కోయంబత్తూరు) ఖండము సభలేర్పరుపబడియున్నవి. అందుచే కాన్ఫరెన్సులు యేటేట క్రమముగ నొక్కొకఖండమున జరుగుటకును, సభయందుచేసిన తీర్మానములన్నియు, ప్రతిఖండమునందును, ఆచరణలోనికి తీసికొనివచ్చుటకు, తగు సాధనములమర్చబడినవి.

## ఉద్దేశములు.

"వైశ్యకులము సాంఘిక, నీతి, మత, విద్యావిషయముల నభివృద్ధిగాంచుటయు, దేశము కృషివాణిజ్యములయందు పెంపుగాంచి, ధనాభివృద్ధిగలిగియుండుటయు, నీయార్యవైశ్య

కాన్ఫరెన్సుయొక్క యుద్దేశములై యున్నవి" అని నిర్మాణము 2 వ నిబంధనయందు స్పష్టముగవివరింపబడియున్నది. మరియు ఈసభలయందు నేటివరకు చేసిన తీర్మానములు ఇండియాదేశపు సర్వజాతులవారిచే నంగీకరింపబడిన సంఘసంస్కారసభలు,మతవిషయికసభలు, విద్యావిషయికసభలు, కృషివాణిజ్యాదికసభలు మున్నగువానియందు అంగీకరింపబడు తీర్మానములెగాని, యెంతమాత్రము భిన్నములైనవి కావని యెల్లరకును దెలిసిన విషయమే.

మరియు నిర్మాణము 3 వ నిబంధనప్రకారము యీ కాన్ఫరెన్సు రాజ్యాంగవిషయములు చర్చింపగూడదు. కాబట్టి వైశ్యకాన్ఫరెన్సులవలన, రాజ్యాంగవిషయము లనె ప్రత్యేకముగచర్చించు మండలసభలు, రాజధానిసభలు, దేశీయమహాజనసభ మున్నగు సభలకెట్టిభంగమును కలుగదు. కలుగుట కవకాశములేదు. వీనిస్వభావముచే దేశీయసభాదర్శముల కు కావలసినయంతర్సలమొసంగుననుట సత్యము.

## ప్రయోజనములు.

ఇట్టికాన్ఫరెన్సులవలన ప్రయోజనము లనేకములుగలవని వేరుగజెప్పనక్కరలేదు. వీనియావశ్యకత ప్రయోజనములంగూర్చి ప్రస్తుతము మాదార్కాపురము డిస్ట్రిక్టుమునసబు పదవియందున్న మహాసభకార్యదర్శిగారు నంబూరి గోపాలకృష్ణరావు బి. యే, బి.యల్. గారుతమ 1910-1911 సంవత్సరము రిపోర్టులో నధిక సమర్థతతో విమర్శించి యిట్లువ్రాసిరి.

" అనేక భిన్నజాతులతో నిండియున్న మన హిందూదేశమున ఒక్కసారిగ ప్రజలందరు నేకీభవించి సకలజాతులయందలి సాంఘికలోపములను సవరించుట మిగులదుస్తరము.

ఏలయన, జాతిబేధములనుబట్టి లోపాలోపములు భిన్నముగనుండును. మరియు ఏజాతియందైనను ప్రస్తుతము ప్రత్యేకముగ బాధించునట్టి లోపములను, నిర్మూలింపవలెనన్న, తజ్జాతివారి ప్రాబల్యము, ధనము, ఐకమత్యబలము మున్నగువానినిబట్టి సంఘసంస్కరణము కొన్నియెడల సులభమగుటయును, కొన్నియెడల కష్టమగుటయును, తటస్థించును. ఇంతియగాక, అట్టిసంస్కారమునకు అవలంబింపవలసిన మార్గములును వేరువేరుగనుండును.

.....................................

.....................మరియు ప్రతికులమువారికిని ఆయాకుల వృత్తులు యేర్పడియున్నవి. మనవైశ్యులు కృషివాణిజ్యముల యందు, అభివృద్ధి నపేక్షించువారగుటచే, ఆయావృత్తులలో పెంపుగాంచుటయందు మనమితరులకన్న ఎక్కువశ్రద్ధవహించుట అత్యావశ్యకమైయున్నది. కావున ఇతరకులస్థులతో అనారోగ్యమైన వైషమ్యములుకలుగజేసికొనక యేకులమువారాకులములో ప్రచురముగనున్న లోటుపాటులను, సవరించుకొని సాంఘికవృద్ధినొందుటకు యత్నించుట మిగుల సుకరముగను, సాధ్యమైనదిగను ఉండును.

ఈరీతిని ప్రతికులమువారు పెంపుగాంచినచో దేశమం

తయు అభివృద్ధినొందునని చెప్పుటకెంతమాత్రమును సందియ
ము లేదు.

పై వాక్యములలో నీసభయొక్క భావము తేటతెల్లముగ
వెల్లడిచేయబడినది. వైశ్యులకాన్ఫరెన్సుమాదిరిని జయప్రద
ముగజరుపబడుచున్న తదితరజాతులసభలే యిందలియదార్థ
మునకు నిదర్శనములు. స్వయంసహాయముచే దేశోపకారకా
ర్యముల నెరవేర్చుకొనుట గౌరవనీయమగునుగదా! ఈవిష
యమే 1913 సం॥ న తిరుచునాపల్లిలో జరిగిన రాజధానిసభ
లో అగ్రాసనాధిపత్యమువహించిన మద్రాసుశాసననిర్మాణస
భాసభ్యులును లోకోపకారకార్యధురీణులును, గౌరవనీయులు
నగు మ॥రా॥మోచర్ల రామచంద్రరావుపంతులు బి. యే. బి.
యల్. గారు, ఆనరబిల్ గోపాలకృష్ణగోక్లేగారు ప్రాథమిక విద్య
నుగురించి పన్నినపద్ధతిని చర్చించుచు ఆత్మవిధితమైన "విద్య
పన్ను" కొన్నిప్రదేశములయందు సంతోషపూర్వకముగ ని
వ్వబడునని చెప్పుచు, వైశ్యులయుద్యమమునుగూర్చి యిట్లు ను
డివిరి.

"In fact a movement of self help, and voluntary taxation for educational purposes has been noticeable among several communities. The Vysya Community is spending yearly large sums on the education of their boys and the Vysya Conference is focussing the attention of the great commercial community on the need for education that now exists among the members of their class."

Speaking of the Kshatrias and the Andhra movement as well, he continued.

"These movements of the day in aid of education augur well for the future"

"విద్యాభివృద్ధికొరకు స్వయంసహాయముఁబూని తమపై తాము పన్నువిధించుకొను నుద్యమమొకటి పెక్కుజాతులలో మనకు పొడకట్టుచున్నది. వైశ్యులు తమపిల్లల విద్యావిషయమై విశేషధనము వెచ్చించుచున్నారు. ఘనతచెందిన వర్తకులైన వైశ్యులు తమకులముఁవారిలోఁగల విద్యాలోపములఁగూర్చి యావచ్ఛ్రద్ధను ఉన్ముఖమునకుదెచ్చుచున్నారు." క్షత్రియులకాన్ఫరెన్సులు, ఆంధ్రోద్యమునుగూర్చి కొంతచెప్పి యీసంఘసభలంగూర్చి యిట్లుకూడనుడివిరి. "విద్యాసహాయార్థముచేయు యీయుద్యమములన్నియు భవిష్యదభివృద్ధిని సూచించుచున్నవి."

ఇందువలన దేశాభివృద్ధికొరకు వైశ్యులుచేయు మహాసభలు, విద్యావిషయిక ప్రయత్నములు, శ్లాఘాపాత్రములని సూచింపబడినది.

ఈసంఘసభలంగూర్చి 1913 సం॥ ము మార్చినెలలో మచిలీపట్టణమున జరిగిన 22 వ కృష్ణామండల సభాధ్యక్షులగు మద్రాసుహైకోర్టువకీలు మ॥రా॥పురాణం నాగభూషణంపంతులు యం. యె. బి. యల్. గారు తమప్రారంభోపన్యాసములో నిట్లు వాక్రుచ్చిరి.

“Though this tendency for people of the same caste or religious sect to meet together and deliberate separately for themselves may at first sight create the impression that the Indians have after all not drifted far from their old moorings and are still quite as custom bound and caste ridden as ever, the proceedings of these bodies do not disclose any narrowness of spirit... .................................
... ............ This feature of our developement far from filling us with dispair should make us more and more hopeful for the future..............................
These organizations so limited in their scope seem to mark not only a step in our progress but a necessary step as it seems to me in our march onward”

“ఏకులమువారైనను లేక యేమతమువారైనను ప్రత్యేకముగనొకచోటగూడి యోచించుట చూచినతోడనె హిందువులు చివరకింకను పూర్వస్థానమునుండి విశేషదూరము సాగిపోలేదనియు, పూర్వమెంతో యిప్పుడునంతె పూర్వాచారపరాయణులనియు, జాతిభేదముగలవారనియు, నభిప్రాయము కలిగినను, యీసభలలోచేసిన తీర్మానములవల్ల ఉదారభావమునకు భిన్నమైనదేమియు కనపడదు.” “మన పరంపరాభివృద్ధిలో నీసంఘ సభాభ్యుదయము మనలను నిరాశాయుతులజేయుటకు మారుగ, ముందంతకంతకు నెక్కువమేలుకలుగునని యాశపుట్టింపవలయును.........” “కొన్ని కార్యములుమాత్రమె నిర్వహింపబూనిన యీసభలు మనకభివృద్ధిదాయకములనియు, ఇంతియకాక, యివిమనపురోవృద్ధి కవసరమనియు నాకుగన్పట్టుచున్నది”

మరియు హిందూదేశమున నిండియున్న నానాజాతుల వారును కాలక్రమంబున నైక్యమయి గమ్యస్థానమెట్లుచేరగలుగుదురని నిరంతరము తలపోయు ఆధునిక భీష్ము లనదగు దేశాభిమానులు మ॥రా॥న్యాపతిసుబ్బారావుపంతులు బి.యే.బి.యల్ గారు బెజవాడయందు జరిగిన ద్వితీయాంధ్రమహాసభలో నొసంగిన అధ్యక్షోపన్యాసమున తమలోకానుభవమును వెల్లడిపరచుచు తమసహజనిపుణతతో నిట్లువాక్రుచ్చిరి.

"It is recognized that before the national edifice is reared, the foundations must be well laid and that each brick that goes to make up the edifice should be solid and strong. I need not refer to the numerous caste and other organizations in Northern India which meet yearly in large numbers. In our own part of the Country we have an annual Vysya Conference started at Guntur, which tries to improve and elevate the powerful trading class of Vysyas found in every important centre in this presidency."

"So long as caste enforces social discipline and regulates the conduct of its members, it is the legitimate function of such organizations to deal with questions of self improvement and social reform and remove the crying evils that now impede their progress and impair their efficiency, as they cannot effectively be dealt with by other bodies composed of persons of diverse creeds and castes. With the broadening and unifying influence of the British Government and organizations like the Indian National Congress, and the onward march

of the national movement in all countries, these groups of sects, castes and communities would in due course coalesce, partaking more and more of the character of clans in a nation and feel that, though belonging to a particular group, they are essentially members of an organic whole, whose duty it is to promote the solidarity and welfare of the people at large"

« జాతీయభవననిర్మాణమునకు పూర్వము మంచిపునాదులువైచి భవననిర్మాణమునందు జేరుప్రతిఅవయవము దృఢమైనదిగను, బలముగలదిగను ఉండవలయుననుట సర్వజనసమ్మతము. ఉత్తరహిందూస్థానమున ప్రతిసంవత్సరము జరుపబడుచున్న వివిధమతశాఖాసభలనుగూర్చి యిచ్చట నంతగచెప్పవలసిన పనిలేదు. ఈప్రాంతమున వైశ్యమహాజనసభ గుంటూరునందు ప్రారంభింపబడి ప్రతిపట్టణమందును ప్రసిద్ధిగాంచిన వర్తకులగు వైశ్యులసంఘాభివృద్ధికై ప్రయత్నించుచున్నది ”

« ఎంతకాలము ఈప్రత్యేకసంఘములు వర్ణాధికారమునకు లోబడియుండునో, అంతకాలము యీప్రత్యేకసభలు అభివృద్ధికి హానికరములగు దురాచారములను పోగొట్టుటకు పాటుపడవలెను. ఒకశాఖవారికి సంబంధించిన ఆచారపద్ధతులను అన్నిజాతులవారు కలసినసభలలో చర్చించుటసాధ్యముకాదు. చర్చించినను విశేషప్రయోజనములేదు. ఇంతేకాక బ్రిటిషు ప్రభుత్వమువలన లభించుచున్న యేకీభావమహిమచేతను దేశీయమహాజనసభయొక్క ఆదర్శమువలనను సమస్తదేశములలోను

జాతీయోద్యమము పరివర్ధమానమగుచుండగ ఈవర్ణములు, సంఘములు, క్రమముగ ఏకీభవించి యీభరతఖండమున నివసించు సమస్తప్రజలకొరకు ఏకీభావముతో కృషిసల్పుదురనుటకు సందేహములేదు"

ఇట్లు సర్వజనసమ్మతమై లోకోపకారమున కవతరించిన యీయుద్యమాంకురమును వైశ్యులు తమ కరుణారసవృష్టిచే బెంచి ధైర్యసాహసములతో గాపాడి తదర్పితఫలంబుల ననుభవించి సుఖింతురని దృఢముగ నమ్ముచున్నారము.

# ఆర్యవైశ్యమహాసభ

## ఉత్తరఖండముకమిటీ

---

### 1913—1914 సం॥ కార్యనివేదనము

---

#### సంఘము రిజిష్టరు చేయబడుట

మదార్సు, కుంభకోణములలో జరిగిన కాన్ఫరెన్సులలో జేయబడిన తీర్మానముల ననుసరించి ఉత్తరఖండముయొక్క (గంజాం, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలయొక్క) వైశ్యసంఘము "ఆర్యవైశ్యమహాసభ ఉత్తరఖండముకమిటీ" అనుపేరుతో 1860 సం॥రము నెం 21 రు ఆక్టు ప్రకారము 1912 సం॥రము నవంబరు నెలలో రిజష్టరు చేయబడినది.

#### సభ్యులు

ఆదిని కుంభకోణము కాన్ఫరెన్సులో నెన్నుకొనబడిన 40 మంది కార్యనిర్వాహకసంఘసభ్యులతో నీసంఘము ప్రారంభమైనది. వీరినామములు నె 1 రు పట్టికయందు ప్రచురింపబడినవి. సంఘాధ్యక్షులగు మ॥ నాళం పద్మనాభం బి. యే.

గారును, కార్యదర్శి సాలస బాపనయ్య బి. యే, బి. యల్. గారును, సభ్యులు గుడిమెట్ల వీరభద్రస్వామి శ్రీకాకోళపు వెంకటాద్రివుగారును, కాకినాడ, రాజమండ్రి, తెనాలిపట్టణములకు వెళ్ళి యిప్పటికి 168 మంది సభ్యులను సంపాదింపగలిగిరి. వారినామములు, వారొసంగెడు సాంవత్సరికచందాలు యిందుతో జతపరచిన నె 2 రు పట్టికయందు స్పష్టముగ వివరింపబడియున్నవి. 1913 వ సంవత్సరము సెప్టెంబరు మాసములో తెనాలి వెళ్ళినపుడు పైనుదహరించినవారికితోడుగ గుంటూరిసభ్యులు పువ్వాడ వెంకటరెడ్డి బి. యే. గారును, మద్ది వెంకటసుబ్బయ్యగారును యేలూరుపురవాసులు మ॥ నంబూరి గోపాలకృష్ణరావు బి. ఏ, బి. ఎల్. గారును, కూడవచ్చి చాలసహాయమొనర్చిరి. ఈసమయమందున రాజధానిఖండపు సభాకార్యదర్శియగు మ॥ తాటికొండ రామచంద్రరావు బి. యె. బియల్ గారుకూడవచ్చి చాలసహాయముచేసిరి. మఱియు, వెళ్ళినప్రతిస్థలమునందును స్థానికసభ్యులు క్రొత్తసభ్యులనుచేర్పించుటయందు మిక్కిలితోడ్పడిరి.

ఇంతియగాక సంఘాధ్యక్షులగు మ॥ నాళం పద్మనాభం బి. యే గారు యేలూరు, గుంటూరు, బెజవాడ, విశాఖపట్టణము మొదలగు గ్రామాదులువెళ్ళి అచ్చట తగువారితో సంప్రదించి సభలుగావించి యీసంఘోద్దేశములు వెల్లడిజేసియున్నారు. ఈగ్రామములయందుకూడ అనేకులు సభ్యులుకాద లంచి యున్నారని తెలుపుట కెంతయు సంతసమగుచున్నది.

## విరాళములు

ఈసంవత్సరమున నీసంఘమున కొసంగబడిన, విరాళములు మొత్తము రు 1048 లును, నె 3రు పట్టికయందు వివరముగ కనుపరుపబడియున్నవి. అధ్యక్షులగు మ॥ నాళం పద్మనాభం బి. యే. గారు తమపుత్రుని అక్షరాభ్యాససమయమున యీఖండమునందు బి. యె. తరగతి చదువు నొకవైశ్యవిద్యార్థి కొకసంవత్సరము జీతముక్రింద వినియోగించవలసినదని చెప్పి రు 116 లు విరాళమొసంగిరి. పాలకొల్లు వాస్తవ్యులు మ॥ అద్దేపల్లి గంగరాజుగారు తమ కుమారుని వివాహసమయమున రు 116 లు విరాళమొసగిరి. జగ్గంపేట కాపురస్థులు ధారా చంద్రశేఖరస్వామిగారు తమ పౌత్రునినామకరణముసమయమున రు 116 లు విరాళమునిచ్చిరి. వీరుచూపించినమార్గమునను సరించి శ్రీమంతులగు వైశ్యులు తమగృహములయందు జరుగు శుభకార్యముల సమయమందు నీసంఘోద్యమము మనస్సునందుంచుకొని ధారాళమైన విరాళములనొసంగెదరని నమ్ముచున్నారము.

దుమ్ముగూడెము వాస్తవ్యులును, వర్తకులును కీర్తిశేషులయిన లగడపాటి చిన్నయ్యగారు తమ మరణశాసనమున నీసంఘమునకు రు 500 ల విరాళమువ్రాసిరి. ఈసొమ్ము వారి కుమారులు వేంకటనాగభూషణముగారు వసూలుయిచ్చిరి. ఈ దానశీలురకందరకును ఈసంఘమువారు మనఃపూర్వకమైన వందనము లాచరించుచున్నారు. మరియు నీసందర్భమున నొక

విశేషముచెప్పవలసియున్నది. గుంటూరుపురమునందలి "ధాన్య ప్రవర్తకసంఘమువారు" తాముచేయువర్తకముపైన ఈసంఘమునకు సంవత్సరమునకు రు 1000 లకు తక్కువకాని యాదాయమువచ్చు నేర్పాటుచేసితిమని మాకుఁదెలియచేసిరనిచెప్పుటకెంతయు సంతసించుచున్నారము. ఇట్టియేర్పాటులు ప్రతిగ్రామమునందును అన్నివర్తకములపైనను యేర్పరచి యీ సంఘమునకు విశేషముగ ధనసహాయము చేసినయెడల సంఘోద్దేశములు త్వరలోనె నెరవేరగలవని వినయపూర్వకముగఁ దెలుపుచున్నారము.

## సహాయముపొందిన విద్యార్థులు

సంఘోద్దేశములలో నొకటియైన బీదబాలురవిద్యాభివృద్ధికొరకు వారికి వేతనములిచ్చుటమాత్రము ప్రస్తుతకాలమున జరుగుచున్నది. సంఘము రిజిష్టరుచేసిన తరువాత సంఘమువలన సహాయముగోరువైశ్యవిద్యార్థులు దరఖాస్తులుపంపవచ్చునని సంఘముపక్షమున వార్తాపత్రికలలో ప్రకటింపబడెను. అందుపై క్రమముగ మొత్తముమీద 68 దరఖాస్తులువచ్చినవి. అందులో 46 గురు యోగ్యులయిన విద్యార్థులకు వేతనములీయబడినవి. అప్పుడప్పుడు వారు విద్యాభ్యాసమున పొందుచున్నయభివృద్ధి యీసంఘమువారిచే సాధ్యమైనంతవరకు పరిశీలింపఁబడుచున్నది. వారినామాదులు నెం 4 రు పట్టికయందు వివరింపఁబడియున్నవి. వీరికి పరీక్షలైనవిగాని వానిపర్యవసానములింకను దెలియలేదు. తెలిసినతోడనె ప్రచురింపఁబడును.

## కార్యనిర్వాహకసభలు

ఈసంవత్సరమున 5 కార్యనిర్వాహకసభలు జరిగినవి. అందు 3 సభలు కాకినాడలోను 2 రాజమహేంద్రవరములోను జరుపఁబడినవి. ఈసభలయందు, విద్యార్థులు పంపిన దరఖాస్తులు పరిశీలించి వారికి ధనసహాయముచేయుట సంఘము లెక్కలు తనిఖీచేసి ఆదాయవ్యయములుమున్నగువాటినింగూర్చి తీర్మానములు చేయఁబడినవి.

## ఆదాయవ్యయములు

సంవత్సరాంతమున నీసంఘముయొక్క లెక్కలు కార్యనిర్వాహకసంఘమువారిచే నియమింపబడిన ఫస్టుగ్రేడుప్లీడరు మా॥ దేవత శ్రీరామమూర్తి బి. యే. గారు పరిశీలించిరి. వారొసంగిన ఆదాయవ్యయములపట్టికయును సర్టిఫికెట్టును నె 5రు పట్టికయందు ప్రకటింపబడినవి. దానివలన ఈసంవత్సరము రు 2638 లు చందాలును, రు 1048 లు విరాళములును, మొత్తము ఆదాయము రు 3686 లు మింజుమలె రు 1340-15-2 విద్యార్థులవేతనములు జీతములు పోస్టేజీ అచ్చుకూలి వగైరాల నిమిత్తము వ్యయమైనట్టును రు 1661-4-10 నిలవయున్నట్టును రు 683-12-0 లు సభ్యులనుండి జమరావలసియున్నట్టును తెలియుచున్నది.

## సంఘస్థితి

ఈసంఘమారంభించి కొంచెమెక్కువగ నొకసంవత్సర

మైనది. సంఘము ప్రజారంజకమగుచున్నది. వైశ్యులందరకు
ను దీనియందాదరము కుదురుచున్నది. కొన్ని చందాలును విరా
ళములును జమవచ్చినవి. కొందరుబీదవిద్యార్థులు సహాయము
పొందిరి. సంఘ మొకింతస్థిరముగ నెలకొల్పఁబడినది.

ప్రారంభించినది మొదలు దీనియందు పూర్ణమైన పూ
నికగలిగి శ్రేయోభిలాష దినదినాభివృద్ధిబొంద నిరంతరము శ్ర
మపడుచున్న సంఘాధ్యక్షులు మ॥ నాళం పద్మనాభం బి. యే.
గారీసంఘమున కొనర్చిన మేలు ఇంతయనిచెప్పనలవికాదు. స్వ
ల్పకాలములో, నీసంఘ మిట్టియున్నతస్థితికివచ్చుటకు వీరిశక్తిసా
మర్థ్యములు, అభిమానాభినివేశములే ముఖ్యకారణములు.
వీరికి సంఘమువారు అనేకమనఃపూర్వకమగు వందనములాచ
రించుచున్నారు. వీరికి సంపూర్ణాయురారోగ్యము లొసంగి స
దాకాపాడుమని సర్వేశ్వరుని ఈసంఘమువారు ప్రార్థించుచు
న్నారు. సుమారు సంవత్సరముపైనుండి గుమాస్తాసహాయ
మైనను లేక కార్యస్థానభారము కడుశ్రద్ధతో నిర్వహించుచు
అభిమానముతో పనిచేసిన కార్యదర్శి మ॥ సొలస బాపనయ్య
బి. యే. బియల్ గారికి ఈసంఘమువారెంతయు కృతజ్ఞులు.
అవసరమైనపుడెల్ల యితరపట్టణములకువెళ్ళి సంఘమునకు సభ్య
సంపాదనచేసి సంఘకార్యములను నెరవేర్చిన కార్యనిర్వాహక
సంఘసభ్యులకు నీసభవారు వందనముల నర్పించుచున్నారు.

## మాయాశలు-కోర్కెలు.

సంఘాభిప్రాయము వ్యాప్తమయి పెక్కుమంది సభ్యులు

చేరి ధనము సమకూరినకొలదిని క్రమక్రమముగ సంఘోద్దేశ
ములలో నొక్కొకటితీసికొని ఈసంఘము నిర్వర్తింప వైశ్యులు
విద్యాగంధముకలిగి కృషివాణిజ్యాదివృత్తులలో నభివృద్ధి
గాంచి సంఘము సంస్కరించుకొని ధనాధికులయి తాముచేయు
వృత్తులకును తమధనమునకును లోకోపకారపరాయణత్వమున
కును అనుగుణ్యమగు సాంఘికబలము సంపాదించి తన్మూల
మున జాతీయభవననిర్మాణమునకు తగురీతిని తోడ్పడగలుగు
దురని మాకోరిక.

ఈసంఘమునకు పరంపరాభివృద్ధియొసంగి పోషించుభా
రము కులాభిమానసంపన్నులగు వైశ్యులది. ఈసంఘమందరి
ప్రోత్సాహము నపేక్షించుచున్నది. కార్యభారముమెండు. అ
దియంతయు నిర్విఘ్నముగ నిర్వహించుటకు సర్వేశ్వరుడు స
ర్వకాలసర్వావస్థలయందును సంపూర్ణశక్తిసామర్థ్యములు
మావైశ్యసోదరుల కనుగ్రహించుగాత.

## 1 నెంబరు పట్టిక.

## కార్యనిర్వాహకసంఘసభ్యులు.

| సంఖ్య. | పేరు. | వృత్తి. | నివాసస్థలము. |
|---|---|---|---|
| 1 | నాళం పద్మనాభంగారు బి. యె. అధ్యక్షుడు, | వర్తకులు | కాకినాడ |
| 2 | నాళం రామలింగయ్యగారు సహాయాధ్యక్షులు | ,, | ,, |
| 3 | సొలస శాపనయ్యగారు బి.యే. బియల్ కార్యదర్శి | న్యాయవాదులు | రాజమండ్రి |
| 4 | నాళం పట్టాభిరామారావుగారు కోశాధిపతి | వర్తకులు | ,, |
| 5 | నంబూరి వెంకటగోపాలరావుగారు | ,, | ,, |
| 6 | మామిడి బుచ్చెయ్యగారు | ,, | ,, |
| 7 | పువ్వాడ వెంకటరెడ్డిగారు బి. యె. | ఉపాధ్యాయులు | గుంటూరు |
| 8 | ధారా చంద్రశేఖరస్వామిగారు | వర్తకులు | జగ్గంపేట |
| 9 | ఆత్మకూరి జగ్గయ్యశెట్టిగారు | ,, | బరంపురము |
| 10 | నాళం క్రిష్ణమూర్తిగారు | ,, | ,, |
| 11 | గుడివాడ వెంకటవరదరాజులుగారు | ,, | శ్రీకాకుళం |
| 12 | విస్సంశెట్టి వెంకటరత్నంగారు | ,, | బెజవాడ |
| 13 | మహాజనపేర్ల రామమూర్తిగారు | ,, | విజయనగరము |
| 14 | సూరంపల్లి వెంకట్రాజుగారు | ,, | ,, |
| 15 | కోలగట్ల చలపతిరావుగారు | ప్లీడరు | ,, |
| 16 | ధారాలింగయ్యగారి సూర్యప్రకాశలింగంగారు | వర్తకులు | ,, |

## 1 నెంబరు పట్టిక.

### కార్యనిర్వాహకసంఘసభ్యులు.

| సంఖ్య | పేరు. | వృత్తి. | నివాసస్థలము. |
|---|---|---|---|
| 17 | పుప్పల బంగారయ్యశెట్టిగారు బి. యె. బియల్ | న్యాయవాదులు | విశాఖపట్నం |
| 18 | విన్నకోట వరహాలుశెట్టిగారు | వర్తకులు | ,, |
| 19 | బలభద్రుని కామరాజుగారు | ,, | భీమునిపట్నం |
| 20 | తాటికొండ నూకయ్యగారు | ,, | అనకాపల్లి |
| 21 | శ్రీ కాకోళపు వెంకట్రావుగారు | ,, | కాకినాడ |
| 22 | గుడిమెట్ల వీరభద్రస్వామిగారు | ,, | ,, |
| 23 | నంబూరి గోపాలక్రిష్ణరావుగారు బి. యె. బి. యల్ | న్యాయవాదులు | ఏలూరు |
| 24 | శ్రీ మోతే గంగరాజుగారు | వర్తకులు | ,, |
| 25 | అప్పన వెంకటక్రిష్ణయ్యగారు | ,, | బెజవాడ |
| 26 | ఉదయగిరి గోపాలరత్నంగారు | న్యాయవాదులు | మచిలీపట్నం |
| 27 | తాడేపల్లి నాగభూషణంగారు | వర్తకులు | మచిలీపట్నం |
| 28 | కంతేటి రామక్రిష్ణయ్యగారు | ,, | ,, |
| 29 | మద్దుల రామానుజరావుగారు | న్యాయవాదులు | ,, |
| 30 | చీమకుర్తి బసవయ్యగారు | వర్తకులు | గుంటూరు |
| 31 | మద్ది వెంకటసుబ్బయ్యగారు | ,, | ,, |
| 32 | తూనుగుంట్ల రామస్వామిగారు బి. యె. బి. యల్ | న్యాయవాదులు | తెనాలి |
| 33 | శిఖరం కోటీశ్వరగుప్తగారు బి. యె. బి. యల్ | ,, | ఒంగోలు |
| 34 | కొమ్మూరి రామయ్యగారు | వర్తకులు | తెనాలి |
| 35 | శ్రీకొత్త సుబ్రహ్మణ్యంగారు | ,, | రాజమండ్రి |

1 నెంబరు పట్టిక.

కార్యనిర్వాహక సంఘసభ్యులు.

| సంఖ్య | పేరు. | వృత్తి. | నివాసస్థలము. |
|---|---|---|---|
| 36 | చోడిశెట్టి వెంకటరత్నంగారు | వర్తకులు | రాజమండ్రి |
| 37 | శ్రీకాకోళపు వెంకటరత్నంగారు | ,, | ,, |
| 38 | పలివెల చిట్టెయ్యగారు | ,, | కాకినాడ |
| 39 | క్లారేపర్ వెంకట చలపతిగారు | ,, | ,, |
| 40 | బాదం అన్నపరాజుగారు | ,, | ,, |

## నె 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| నెంబరు | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 1 | మామిడి బుచ్చెయ్యగారు | రాజమండ్రి | 103 |
| 2 | బంగారు రాఘవయ్యగారు | ,, | 50 |
| 3 | శ్రీగుండు వెంట్రాజుగారు | ,, | 12 |
| 4 | గ్రంధి వెంకటరత్నం పుప్పలరాజుగార్లు | ,, | 24 |
| 5 | బత్తుల రామలింగయ్యగారు | ,, | 12 |
| 6 | నంబూరి వెంకటగోపాలరావుగారు | ,, | 3 |
| 7 | నాళం విశ్వనాధంగారు | ,, | 12 |
| 8 | నాళం కామరాజుగారి వెంకటరత్నముగారు | ,, | 25 |
| 9 | పెంజర్ల రామయ్య చోడిశెట్టి వెంకటరత్నముగార్లు | ,, | 50 |
| 10 | వాగుమిల్లి వెంకటసుబ్బయ్య గ్రంధి సత్తిరాజుగార్లు | ,, | 30 |
| 11 | దాసరి వాసుదేవమూర్తిగారు | ,, | 12 |
| 12 | శ్రీబయిసాని వెంకటరమణయ్యగారు | ,, | 25 |
| 13 | బయిసాని సుబ్బయ్యగారు | ,, | 6 |
| 14 | పుప్పల వీరయ్యగారు | ,, | 12 |
| 15 | కొనగళ్ళ నారయ్యగారు | ,, | 3 |
| 16 | నార్కెడమిల్లి వెంకటరమణయ్యగారు | ,, | 6 |
| 17 | కాకి కృష్ణమూర్తిగారు | ,, | 12 |
| 18 | ధారా సూర్యప్రకాశలింగంగారు | ,, | 24 |
| 19 | మాటూరి సూర్యనారాయణగారు | ,, | 25 |
| 20 | జాపూడి సరయ్యగారు | ,, | 15 |
| 21 | మండవిల్లి సుబ్బారావుగారు | ,, | 25 |

## నె 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| నెంబరు. | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 22 | కాకి రామమూర్తిగారు | రాజమండ్రి | 12 |
| 23 | వుడత్తు పెదవెంకటరత్నంగారు | ,, | 12 |
| 24 | వడిపల్లి వెంకటాద్రిజుగారు | ,, | 12 |
| 25 | చలంచర్ల నాగయ్యగారు | ,, | 25 |
| 26 | కొత్త సుబ్బరాజుగారు | ,, | 12 |
| 27 | బత్తుల వెంకటస్వామి, కక్కిరాల శ్రీరాములు యీసుబ్బారావు, గ్రంధి చంచయ్యగార్లు | ,, | 25 |
| 28 | కూరపాటి వెంకటరత్నంగారు | ,, | 6 |
| 29 | చలంచర్ల రామయ్య కూరపాటి వెంకటరత్నంగార్లు | ,, | 6 |
| 30 | నాగవరపు బుచ్చిఅబ్బాయిగారు | ,, | 4 |
| 31 | శ్రీకాకుళపు వెంకటరత్నంగారు | ,, | 25 |
| 32 | గ్రంధి వెంకట్రాజు బాలనాగు వీరాస్వామిగార్లు | ,, | 50 |
| 33 | వుడత్తు కమలనాథంగారు | ,, | 15 |
| 34 | మామిడి మంగరాజు అండుకోవారు | ,, | 30 |
| 35 | అప్పన చినసుబ్రహ్మణ్యంగారు | ,, | 6 |
| 36 | వెచ్చా రామలింగయ్యగారు | ,, | 12 |
| 37 | బాదం శేషయ్యగారు | ,, | 25 |
| 38 | బత్తుల నమశ్శివాయిగారు | ,, | 25 |
| 39 | అప్పన మాణిక్యంగారు | ,, | 6 |
| 40 | కంకటాల నారాయణమూర్తిగారు | ,, | 6 |

## నె 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| వరుస నం. | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 41 | మద్దుల వీర్రాజు సింహాద్రి వీర్రాజుగార్లు | రాజమండ్రి | 6 |
| 42 | తమ్మన సీతారామయ్యగారు | ,, | 6 |
| 43 | రాయపూడి అప్పన్నగారు | ,, | 6 |
| 44 | మొగల్లపల్లి కామరాజుగారు | ,, | 6 |
| 45 | నూలు మాణిక్యంగారు | ,, | 25 |
| 46 | నార్కేడమిల్లి సూరయ్యగారు | ,, | 5 |
| 47 | కక్కిరాల సుబ్బయ్య పువ్వాడ నరసింహంగార్లు | ,, | 12 |
| 48 | కొత్త వెంకటరమణయ్య గొల్లపూడి శీతయ్యగార్లు | ,, | 12 |
| 49 | కొత్త వెంకన్నగారి శ్రీరాములు మట్టే సుబ్బారావుగార్లు | ,, | 24 |
| 50 | కాళ్లకూరి సుబ్బారాయుడు కొత్త అప్పన్నగార్లు | ,, | 24 |
| 51 | మాజేటి ఆంజనేయులు వెంకటరత్నంగార్లు | ,, | 20 |
| 52 | పెంజర్ల వెంకటరత్నంగారు | ,, | 6 |
| 53 | మద్దుల సరయ్య కొల్లేపర అచ్యుతంగార్లు | ,, | 25 |
| 54 | శిర్విశెట్టి నూకరాజుగారు | ,, | 12 |
| 55 | శిర్విశెట్టి వెంకటరాజుగారు | ,, | 12 |
| 56 | రాయపూడి జగ్గన్న చిన్నం లక్ష్మీనారాయణగార్లు | ,, | 6 |
| 57 | మద్దుల బాపన్నగారు | ,, | 12 |
| 58 | కోడూరి నాగయ్య, పెంజర్ల మంగయ్య, కారుమూరి శ్రీరామమూర్తిగార్లు | ,, | 12 |

## నెం 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| నెంబరు | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. రూ. |
|---|---|---|---|
| 59 | నాళం పట్టాభిరామారావుగారు | రాజమండ్రి | 28 |
| 60 | అప్పన సుబ్రహ్మణ్యంగారు | రాజమండ్రి | 12 |
| 61 | చోప్పెర్ల చలమయ్యగారు | రాజమండ్రి | 6 |
| 62 | కాకి వెంకటబ్రహ్మయ్య అండుసన్సు | రాజమండ్రి | 25 |
| 63 | నాళం ఆంజనేయులుగారి వెంకటరత్నం గారు | రాజమండ్రి | 10 |
| 64 | సున్న వెంకటరత్నంగారు | రాజమండ్రి | 24 |
| 65 | అద్దేపల్లి మృత్యుంజయుడుగారు | రాజమండ్రి | 20 |
| 66 | మామిడి సుబ్బారాయుడుగారు | రాజమండ్రి | 6 |
| 67 | కాకి వెంకటరాజుగారు | రాజమండ్రి | 12 |
| 68 | నూలు రత్తమ్మగారు | రాజమండ్రి | 12 |
| 69 | మట్టే వెంకటరాజుగారు | రాజమండ్రి | 9 |
| 70 | గ్రంధి షరాబు, మల్లవరపు కామరాజుగారు | రాజమండ్రి | 6 |
| 71 | ములమూతి సుబ్బారావుగారు | రాజమండ్రి | 6 |
| 72 | నాళం సుబ్బారావుగారు | రాజమండ్రి | 25 |
| 73 | మైలవరపు కోటయ్యగారు | రాజమండ్రి | 6 |
| 74 | మారడుగుల వెంకటరత్నముగారు | రాజమండ్రి | 12 |
| 75 | నాళం సుబ్రహ్మణ్యంగారు | రాజమండ్రి | 15 |
| 76 | శింగంశెట్టి వెంకటస్వామిగారు | రాజమండ్రి | 6 |
| 77 | కొత్త సుబ్రహ్మణ్యంగారు | రాజమండ్రి | 3 |
| 78 | సాలస బాపనయ్యగారు | రాజమండ్రి | 3 |
| 79 | కొరళ్ల వెంకయ్యగారు | నిడిగట్ల | 6 |
| 80 | నాళం పద్మనాభంగారు | కాకినాడ | 60 |

## నెం 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| వరుస నెం. | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 81 | నాళం రామలింగయ్యగారు | పిఠాపురం | 60 |
| 82 | బాదం అన్నపరాజుగారు | | 24 |
| 83 | పలివెల చిట్టెయ్యగారు | | 12 |
| 84 | శ్రీకాకోళపు వెంకట్రావుగారు | | 12 |
| 85 | గుడిమెట్ల వీరభద్రస్వామిగారు | | 12 |
| 86 | గుడిమెట్ల మంగమ్మగారు | | 75 |
| 87 | బచ్చు వెంకటరత్నంగారు | | 15 |
| 88 | ముత్తా సర్వారాయుడుగారు | | 12 |
| 89 | ముత్తా మాణిక్యంగారు | | 35 |
| 90 | చిట్టూరి అచ్చిరాజుగారు | | 12 |
| 91 | నిజ్జపు సత్యానందంగారు | | 50 |
| 92 | పురం చినవెంకటనారాయణగారు | | 30 |
| 93 | కొల్లేపర వెంకటచలపతిగారు | | 30 |
| 94 | కొల్లేపర వెంకట్రాజుగారు | | 30 |
| 95 | సమయమంత్రి రామయ్యగారు | | 3 |
| 96 | కొల్లేపర చిట్టిశ్రీరాజుగారు | | 6 |
| 97 | బొగ్గవరపు సుబ్బారావుగారు | | 18 |
| 98 | బచ్చు చినవెంకట్రాయుడుగారు | | 12 |
| 99 | బచ్చు పేర్రాజుగారు | | 6 |
| 100 | బాదం చినఅన్నపరాజుగారు | | 30 |
| 101 | రావుసాహేబు పైడా వెంకటచలపతిగారు | | 15 |
| 102 | బచ్చు వెంకటరమణమూర్తిగారు | | 6 |
| 103 | మండవిల్లి రామన్నగారు | | 12 |

## నె 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| నెంబరు | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 104 | బచ్చు వెంకట్రాయుడుగారు | | 15 |
| 105 | బోడా రాజు అందుకోవారు | | 9 |
| 106 | పైడా చలమయ్యాగారు | | 6 |
| 107 | బొండాడ పుల్లయ్యాగారు | | 12 |
| 108 | తమ్మన గోపయ్యాగారు | | 9 |
| 109 | మాజేటి వెంకటరమణయ్యాగారు | | 18 |
| 110 | బాదం సుబ్బారావుగారు | | 12 |
| 111 | పైడా రామక్రిష్ణయ్యాగారు | | 6 |
| 112 | చిట్టూరి గవర్రాజుగారు | | 4 |
| 113 | మల్లవోలు సుబ్బయ్యాగారు | | 6 |
| 114 | పురం అచ్చుతరాజాజీగారు | [illegible] | 6 |
| 115 | మండ బుచ్చెయ్యాగారు | | 6 |
| 116 | వెచ్చా కామరాజుగారు | | 12 |
| 117 | నార్కెడమిల్లి చినవెంకటరత్నంగారు | | 12 |
| 118 | బచ్చు సూరయ్యాగారు | | 5 |
| 119 | పలుకూరి వెంకట్రాజుగారు | | 5 |
| 120 | తటవర్తి సత్తిరాజుగారు | | 5 |
| 121 | మండవిల్లి మంగరాజుగారు | | 4 |
| 122 | జయవరపు వీరేశలింగంగారు | | 5 |
| 123 | బొడ్డు బాపిరాజుగారు | | 15 |
| 124 | కనుమూరి రామలక్ష్మమ్మగారు | | 25 |
| 125 | సంకా చినవెంకటప్పయ్యాగారు | తెనాలి | 50 |
| 126 | ముండూరి వెంకటప్పయ్యాగారు | ,, | 50 |

## నె 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| సంఖ్య. | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 127 | మండూరి పెదరామన్న & సన్సువారు | | 100 |
| 128 | కొల్లా గురవయ్యగారు | | 50 |
| 129 | చుండూరి సాంబయ్యగారు | | 60 |
| 130 | సంకా పున్నయ్యగారు | | 50 |
| 131 | కంకిపాటి వీరేశంగారు | | 25 |
| 132 | మండూరు వెంకటనరసింహంగారు | | 25 |
| 133 | సంకా పెదపున్నయ్యగారు | | 15 |
| 134 | మండూరు పెదఅంకయ్యగారు | [illegible] | 12 . 8 |
| 135 | గుడివాడ సుబ్రహ్మణ్యంగారు | | 8 1 |
| 136 | మూజేటి సర్సయ్యగారు | | 12 8 |
| 137 | ఇమ్మిడి పున్నయ్యగారు | | 5 |
| 138 | ఇమ్మిడి కోటయ్యగారు | | 10 |
| 139 | ముద్ది వెంకటరత్నముగారు | | 15 |
| 140 | తూముగుంట్ల రామస్వామిగుప్త గారు | | 15 |
| 141 | కొమ్మూరి రామయ్యగారు | | 3 |
| 142 | పువ్వాడ వెంకటరెడ్డిగారు | | 3 |
| 143 | చీమకుర్తి బసవయ్యగారు | గుంటూరు | 3 |
| 144 | ముద్ది వెంకటసుబ్బయ్యగారు | | 8 |
| 145 | ఉదయగిరి గోపాలరత్నముగారు | | 3 |
| 146 | తాడేపల్లి నాగభూషణము గారు | నరసరావుపేట | 3 |
| 147 | కంచేటి రామకృష్ణయ్యగారు | | 3 |
| 148 | మద్దుల రామానుజరావు గారు | | 8 |

## నె 2 రు పట్టిక—సాధారణసభ్యులు.

| నెంబరు | పేరు. | నివాసస్థలము. | సంవత్సరపు చందా. |
|---|---|---|---|
| 149 | విస్సంసెట్టి వెంకటరత్నంగారు | బెజవాడ | 3 |
| 150 | అప్పన వెంకటకృష్ణయ్యగారు | | 3 |
| 151 | నంబూరి గోపాలకృష్ణరావుగారు | ఏలూరు | 3 |
| 152 | మోతే గంగరాజుగారు | | 3 |
| 153 | ధారా చంద్రశేఖరస్వామి | జగ్గంపేట | 3 |
| 154 | తాటికొండ నూకయ్యగారు | అనకాపల్లి | 3 |
| 155 | పుప్పల బంగారయ్యశ్రేష్ఠిగారు | విశాఖ పట్నం | 3 |
| 156 | విన్నకోట వరహాలుశ్రేష్ఠిగారు | | 3 |
| 157 | మహాజన పేర్ల రామమూర్తిశ్రేష్ఠిగారు | విజయనగరం | 3 |
| 158 | సూరంపల్లి వెంకటరాజుగారు | | 3 |
| 159 | కోలగట్ల చలపతిరావుగారు | | 3 |
| 160 | ధారా లింగయ్యగారి సూర్యప్రకాశలింగంగారు | | 3 |
| 161 | గుడ్డినాడ వెంకటనరదరాజులుగారు | శ్రీకాకుళం | 3 |
| 162 | ఆత్మకూరి జగ్గయ్యశ్రేష్ఠిగారు | బరంపురం | 3 |
| 163 | నాశం కృష్ణమూర్తిగారు | | 3 |
| 164 | బలభద్రుని కామరాజుగారు | భీమునిపట్నం | 3 |
| 165 | శిఖరం కోటీశ్వరగుప్తగారు | ఒంగోలు | 3 |
| 166 | లగడపాటి వెంకటనాగభూషణంగారు | దుమ్ముగూడెం | 3 |
| | | మొత్తం రు | 2638 |
| 167 | అద్దేపల్లి గంగరాజుగారు | పాలకొల్లు | విరాళము లిచ్చిరి. |
| 168 | గుంటూరు ధాన్యపువర్తకులసంఘము | గుంటూరు | |

## నె 3 రు పట్టిక—విరాళములనిచ్చిన సభ్యులు.

| వరుస నెంబరు. | పేరు. | నివాసస్థలము. | విరాళముల మొత్తము. |
|---|---|---|---|
| 1 | నాళం పద్మనాభంగారు బి. యే. | కాకినాడ | 116 |
| 2 | ధారా చంద్రశేఖరస్వామిగారు | జగ్గంపేట | 116 |
| 3 | అద్దేపల్లి గంగరాజుగారు | పాలకొల్లు | 116 |
| 4 | లగడపాటి చిన్నయ్యగారు | దుమ్ముగూడెం | 500 |
| *5 | గుంటూరు ధాన్యపువర్తకుల సంఘమువారు | గుంటూరు | 200 |
| | | మొత్తము. | 1048 |

*ఇందలిసభ్యులు: 1 మద్ది వెంకటరత్నంగారు 2 అరవపల్లి వెంకటప్పయ్యగారు 3 కొల్లేపర వెంకటరత్నంకంపెనీ కొల్లేపర రామకోటయ్యగారు 4 మద్ది వెంకటనాగభూషణంగారు 5 దాసరి హనుమయ్యగారు 6 కొల్లేపర రాధాకృష్ణమూర్తిగారు 7 పక్కలగడ్డ లక్ష్మీపున్నయ్యగారు 8 రాచపూడి వెంకటనర్సుగారు 9 పక్కలగడ్డ లక్ష్మీపున్నయ్యగారు 10 మద్ది వెంకటరంగయ్యగారు 11 నంబూరి వెంకటాద్రిగారు 12 మద్ది వెంకటసుబ్బయ్యగారు 13 కూర్మాల అప్పయ్యగారు

## నె 4 వ పట్టిక—సహాయము పొందిన విద్యార్థులు.

| సంఖ్య | పేరు. | వాసస్థలము. | తరగతి. | కాలేజీ లేక స్కూలు. | సహాయము ను పొందిన మొత్తము. రు. | అ |
|---|---|---|---|---|---|---|
| 1 | సూరంపల్లి కృష్ణమూర్తి | విజయనగరం | స్కూలుఫయినలు | మహారాజావారి కళాశాల | 30 | |
| 2 | నంబూరి ఆంజనేయులు | బెజవాడ | స్కూలుఫయినలు | ఎస్. కె. పి. హెచ్. హైస్కూలు | 24 | |
| 3 | మద్దుల సత్యసూర్యనారాయణ | ఏలూరు | నాలుగవఫారము | సి. ఎమ్. ఎస్. హైస్కూలు | 24 | |
| 4 | జలదు పున్నయ్య | మచిలీపట్నం | నాలుగవఫారము | నోబులు కళాశాల | 24 | |
| 5 | తూనుగుంట్ల సత్యనారాయణ | బాపట్ల | ఆరవఫారము | బోర్డు హైస్కూలు | 24 | |
| 6 | తూనుగుంట్ల లక్ష్మీనారాయణ | బాపట్ల | నాలుగవఫారము | బోర్డు హైస్కూలు | 24 | |
| 7 | కురివేళ్ల వెంకటనీలాద్రిరావు | విశాఖపట్నం | అయిదవఫారము | Mrs. ఎవి.యన్. కళాశాల | 24 | |
| 8 | పెనుగొండ నారాయణ | మచిలీపట్నం | స్కూలుఫయినలు | నోబులు కళాశాల | 24 | |
| 9 | దొంతుల వెంకటకామరాజు | విశాఖపట్నం | నాలుగవఫారము | సి. బి. యం. హైస్కూలు | 24 | |
| 10 | కొత్త వెంకటరమణ | రాజమండ్రి | నాలుగవఫారము | వీరేశలింగం హైస్కూలు | 24 | |
| 11 | పేర్ల గురుమూర్తి | విజయనగరం | నాలుగవఫారము | మహారాజావారి కళాశాల | 24 | |
| 12 | కోపూరు సీతారామయ్య | తెనాలి | నాలుగవఫారము | తాలూకా హైస్కూలు | 24 | |

## నెం:4 రు పట్టిక—సహాయము పొందిన విద్యార్థులు.

| సంఖ్య | పేరు. | వాసస్థలము. | తరగతి. | కాలేజీ లేక స్కూలు. | సహాయమును పొందిన మొత్తము. రు. | అ |
|---|---|---|---|---|---|---|
| 13 | గుడిమెట్ల శీతన్న | కాకినాడ | నాలుగవఫారము | మెక్లారన్ హైస్కూలు | 30 | |
| 14 | నార్కెడమిల్లి లక్ష్మారావు | కాకినాడ | రెండవఫారము | పి. రాజావారి కళాశాల | 12 | |
| 15 | నార్కెడమిల్లి ధనరాజు | కాకినాడ | రెండవఫారము | పి. రాజావారి కళాశాల | 12 | |
| 16 | బోడా చినవెంకటాద్రిజు | జగన్నాధపురం | రెండవఫారము | పి. రాజావారి కళాశాల బ్రాంచిస్కూలు | 24 | |
| 17 | వబిలిశెట్టి రంగనాయకులు | కాకినాడ | మూడవఫారము | పి. రాజావారి కళాశాల | 24 | |
| 18 | పచ్చిపులుసు శ్రీరామమూర్తి | కాకినాడ | అయిదవఫారము | పి. రాజావారి కళాశాల | 30 | |
| 19 | నంబూరి హయగ్రివరావు | ఏలూరు | ఆరవఫారము | సి. యం. ఎస్ హైస్కూలు | 24 | |
| 20 | కంగుల వెంకటరమణయ్య | విజయనగరం | ఆరవఫారము | మహారాజావారి కళాశాల | 24 | |
| 21 | మానేపల్లి వెంకటసుబ్బారావు | మచిలీపట్నం | ఆరవఫారము | నోబులు కళాశాల | 24 | |
| 22 | గుంపెన నారాయణమూర్తి | విజయనగరం | ఆరవఫారము | మహారాజావారి కళాశాల | 24 | |
| 23 | మాటూరి శీతారామయ్య | మచిలీపట్నం | ఆరవఫారము | నోబులు కళాశాల | 24 | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 24 | సూరంపల్లి అప్పారావు | విజయనగరం | స్కూలుఫయినలు | మహారాజావారి కళాశాల | 24 |
| 25 | కట్టమూరి తిమ్మన్న | శ్రీకాకుళం | అయిదవఫారము | మ్యూనిసిపల్ హైస్కూలు | 24 |
| 26 | కోలగట్ల సూర్యనారాయణ | విజయనగరం | నాలుగవఫారము | మహారాజావారి కళాశాల | 24 |
| 27 | పప్రిత్తి వెంకటాద్రివు | బరంపురం | నాలుగవఫారము | కల్లికోట కళాశాల | 24 |
| 28 | గమిని సూర్యనారాయణ | కాకినాడ | నాలుగవఫారము | పి. రాజావారి కళాశాల | 24 |
| 29 | కోలగట్ల రామమూర్తి | విజయనగరం | మూడవఫారము | మహారాజావారి కళాశాల | 18 |
| 30 | కొప్పర్తి బలరామమూర్తి | కాకినాడ | మూడవఫారము | పి. రాజావారి కళాశాల | 18 |
| 31 | మల్లవోలు నాగభూషణము | మచిలీపట్నం | రెండవఫారము | నోబులు కళాశాల | 18 |
| 32 | నార్కెడమిల్లి లక్ష్మీనారాయణ | కాకినాడ | రెండవఫారము | పి. రాజావారి కళాశాల | 18 |
| 33 | గ్రంధి లక్ష్మీనారాయణ | కాకినాడ | ఆరవఫారము | పి. రాజావారి కళాశాల | 32 |
| 34 | భోగవల్లి వెంకటశాస్త్రి | విశాఖపట్నం | ఆరవఫారము | పి. బి. యం. హైస్కూలు. | 24 |
| 35 | భోగవల్లి వెంకటసత్యనారాయణ | విశాఖపట్నం | జూనియరు ఇంటరు మీడియేటుతరగతి | Mrs. ఎ.వి.యన్ కళాశాల | 72 |
| 36 | తటవర్తి పెరియాళ్వారు శెట్టి | పిఠాపురం | ఆరవఫారము | హైస్కూలు | 72 |
| 37 | సూరంపల్లి వెంకటరామమూర్తి | విశాఖపట్నం | ఆరవఫారము | Mrs. ఎ.వి.ఎన్. కళాశాల | 24 |
| 38 | కనికిచర్ల చితంబరము | తెనాలి | స్కూలుఫయినలు | తాలూకా హైస్కూలు | 24 |
| 39 | వాబిలిశెట్టి బంగారయ్య | బరంపురం | స్కూలుఫయినలు | కల్లికోటకళాశాల | 24 |

5

## నె 4 రు పట్టిక—సహాయము పొందిన విద్యార్థులు.

| సంఖ్య | పేరు. | వాసస్థలము. | తరగతి. | కాలేజీ లేక స్కూలు. | సహాయము ను పొందిన మొత్తము. రు | అ |
|---|---|---|---|---|---|---|
| 40 | నంబూరి సూర్యనారాయణ | బెజవాడ | అయిదవఫారము | పి. యం. ఎస్. హైస్కూలు | 24 | |
| 41 | తూనుగుంట్ల వెంకటలింగం | తెనాలి | అయిదవఫారము | తాలూకా హైస్కూలు | 24 | |
| 42 | ఇమ్మిడి వెంకటచలమయ్య | తెనాలి | మూడవఫారము | తాలూకా హైస్కూలు | 18 | |
| 43 | నంబూరి సుబ్బారావు | మచిలీపట్నం వద్ద ఇనుగుదురు | రెండవఫారము | నోబులు బాంచి స్కూలు | 18 | |
| 44 | తవ్వా నాగేశ్వరరావు | కాకినాడ | రెండవఫారము | పి. రాజావారి కళాశాల | 18 | |
| 45 | బాదం సుబ్రహ్మణ్యం | కాకినాడ | రెండవఫారము | పి. రాజావారి కళాశాల | 18 | |
| 46 | సత్యవరపు పరమేశ్వరరావు | కాకినాడ | రెండవఫారము | పి. రాజావారి కళాశాల | 26 | 2 |
| | | | | మొత్తము. | 1156 | 2 |

నెం 5 రు పట్టిక—ఆర్యవైశ్యమహాసభ,

ఉత్తరఖండము కమిటీయొక్క 1913-1914 సంవత్సరము యొక్క ఆదాయవ్యయపట్టిక.

| ఆదాయము. | రు. | అ. | పై. | వ్యయము. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| చందాలు | 2638 | 0 | 0 | వైశ్యవిద్యార్థులకొసగిన వేతనములు | 1156 | 2 | 0 |
| విరాళములు | 1048 | 0 | 0 | రావలసిన చందాలు | 451 | 12 | 0 |
| | | | | రావలసిన విరాళములు | 232 | 0 | 0 |
| | | | | జీతములు | 23 | 10 | 8 |
| | | | | సంఘము రిజిష్ట్రీపను నిమిత్తం చెల్లించినఫీజు | 50 | 0 | 0 |
| | | | | పోస్టేజి, మణియార్డరుకమీషను, అచ్చుకూలి, కాగితములు వగైరా సాదరుఖర్చులు. | 111 | 2 | 6 |
| | | | | ఖర్చులమొత్తము | 2024 | 11 | 2 |
| | | | | నిల్వనగదు | 11 | 4 | 10 |
| | | | | సేవింగ్సుబ్యాంకిలోనిల్వ | 1650 | 0 | 0 |
| మొత్తము. | 3686 | 0 | 0 | మొత్తము. | 3686 | 0 | 0 |

1913 జనేవరు 1 వ తేదీ మొదలు 1914 సం॥ మార్చి 31 వ తేదివరకు ఉంచబడిన యీఖండముకమిటీయొక్క జమాఖర్చుబుక్కులు తణిఖీచేసినాను. ఆదాయవ్యయములకు సరియయినరశీదులు ఉంచబడినవి. ఈకమిటియొక్క ఆదాయవ్యయముల నిజస్థితిదెలుపుచు క్రమప్రకారము యీలెఖ్ఖబుక్కులు వ్రాయబడినట్లు నేనునమ్ముచున్నాను.

రాజమండ్రి, 27-4-1914 (Sd) దేవత శ్రీరామమూర్తి బి. యె. ఆడిటరు.

# విజ్ఞాపనము.

వైశ్యసహోదరులారా!

ఈసంఘముయొక్క యుద్దేశప్రయోజనములు వీఠిక యందు వివరింపబడినవి. ఇట్టి ఉద్దేశములను నెరవేర్చుటకు విద్యయే ముఖ్యసాధనమని మీకెల్లరకును తెలిసినవిషయమే. తెలిసియు నూరకుండుట కడుశోచనీయము. దేనివలన మనకోర్కెలన్నియు లభింపగలవో, దేనివలన మనకొరతలను దీర్చుకొనగలుగుదుమో, దేనివలన మన సాంఘిక మత వాణిజ్యముల యందలి లోపములను సవరించుకొని యభివృద్ధిలోనికి రాగలమో, దేనివలన ఇహపరసుఖములు మనకు సాధ్యములగునో, అట్టివిద్యయెడ మనమశ్రద్ధగనుండుట మిక్కిలి సంతాపకరము.

మరియు, వైశ్యులు ముఖ్యముగ వర్తకులగుటచే, వాణిజ్యవ్యాపారముల యందు అభివృద్ధిగాంచవలసియున్నది. పాశ్చాత్యవర్తకులు వాణిజ్యమం దున్నతదశకువచ్చుటకు వారభ్యసించిన విద్యయే మూలకారణము. వారవలంబించిన మార్గములు మనముకూడ అవలంబించవలయును. ప్రతిపట్టణమున వర్తకసంఘములు స్థాపింపబడవలయును. వాణిజ్యవిద్య నభ్యసించవలయును. నానాదేశవాణిజ్య పద్ధతులను గరవుచరిత్రములను వర్తకమునకు సంబంధించిన వార్తలు దెలుపుపత్రికలను, ప్రచురపరచి వ్యాపింపచేయవలయును.

సమస్త వ్యాపారములకు గావలసిన ధనసంపత్తి వైశ్యుల యందుండుటచేత, మిక్కిలి దురవస్థయందున్న, దేశవృత్తుల పునరుద్ధారణచేసి వృత్తిభంగముచే బీదలై యున్న నేతగాండ్రు మొదలగు స్వదేశకర్మకారులకు జీవనాధారము కల్పించుట వైశ్యులభారమై యున్నది. ఇందుకు సహాయసంఘములు స్థాపించవలయును. స్వదేశవస్తు నిర్మాణముకొరకు యంత్రసహాయ్యముచే నడచుఫ్యాక్టరీలను నెలకొల్పుట దేశక్షేమమున కత్యావశ్యకము. ఇట్టి లోకోపకారకార్యములకు ధనమత్యావశ్యకమని నే వేరుగ జెప్పనక్కరలేదుగదా! వైశ్యులు ధనాధికులు. దానశీలురు. పరోపకారపరాయణులు. వైశ్యకులాభివృద్ధికిని దేశక్షేమమునకును పాటుపడు యీసంఘముయొక్క ఉద్దేశముల నెరవేర్చుటకు ధారాళమైన ఔదార్యము కనపరచెదరని మాగట్టినమ్మకము. ఇట్టిఉద్యమమునకు బీజముత్సాహము. తదాచరణ సంకల్పసిద్ధికి సాధనము. సంకల్పములేనికార్య మసంభవము. కార్యములకు సంకల్పముమొదలు, ఫలసిద్ధి యంతము. ఫలసిద్ధికలుగుటకు పట్టుదల యావశ్యకము. పట్టుదల ఓరిమితోగూడిన శ్లాఘాపాత్రమగును.

కావున మేమువ్రాసిన కార్యాధిక్యత పూర్ణముగ గ్రహించి విసువనిపూనికతో ఈయుద్యమమును కొనసాగించుట వైశ్యుల కర్తవ్యము.

వైశ్యసోదరులారా! ఈసంఘముయొక్క లాభములు పెక్కుమంది పొందవలయుననియు, ఇట్టిసత్కార్యములకు తోడ్పడుసంతోషము పుణ్యము పెక్కుమందికి లభించవలయుననియు

సంఘ మీరూపమున స్థాపింపబడినది.

కాబట్టి కులాభిమానులును, దేశోపకారపరాయణులును, దానశీలురునగు వైశ్యసహోదరులు తాముసభ్యులుగ జేరియు ఇతరులను ప్రోత్సాహపరచి చేర్పించియు సంఘోద్దేశములు పూర్ణముగ నెరవేరుటకు సర్వవిధముల కావలసిన సహాయమొనర్చియు శాశ్వతకీర్తి పొందగలందులకు వినయపూర్వకముగ వేడుచున్నారము.

సోలస బాపనయ్య, బి. యె. బి. యల్.

కార్యదర్శి.

SCAPE & Co., PRINTERS, COCANADA:—1914.